# విభూతి

సంపాదకులు

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

సారస్వత ధార్మిక మాసపత్రిక



| | | |
|---|---|---|
| పుష్పము 3 | శా. ౧౮౬౪ చిత్రభాను నిజజ్యేష్ఠము — శికింద్రాబాద్ — | రేఖ ౧౧ |
| Vol. 3. | 25th June 1942 SECUNDERABAD | No. 11 |

సం॥ర చందా

౨-౮-౦

# విభూతి - విషయసూచిక

## చిత్రభాను - నిజ జ్యేష్ఠము



సారస్వత ధార్మిక మాసపత్రిక

| సంపుటము ౩ Vol. 3 | శా ౧౮౬౪ చిత్రభాను నిజజ్యేష్ఠము, —సికింద్రాబాదు 25th June, 1942–Secunderabad | రేఖ ౧౧ No. 11 |
|---|---|---|

# రాటము

బాలకవి : భాగవతుల నరసింహమూర్తి.

ఉ॥ కన్నులు విప్పి లోకములు గన్గొని యబ్బురపాటుఁ జెందగా
మున్నొక కాలమున్ భరతభూమి యశశ్శరదిందు కాంతితో
సన్ననిజిల్గు వల్వలఁ బ్రచారము సల్పి ప్రశస్తి కెక్కుటల్
నిన్ను వరించి కాదె? జననీ! సకలోర్వి మెఱుంగు రాటమా!

క॥ ఎక్కడ కదు రాడెడినో, యక్కడ కలవుండదనెడు నార్యోక్తి సదా
నిక్కమని దోఁచె మా కిక, దిక్కయి నిల్వంగరాదె దీనత బాపన్.

సీ॥ తళ్కుబెళ్కులపైని తగులంబుఁదప్పించి, సిరోమహాసంస్తుతి నెగడఁజేసి
తగని వస్తువుల చిత్తంబు పాఱగనీక, యేకాగ్రవృత్తిని జోకపరచి
కలతలేనట్టి యస్ఖలిత దృష్టినిగూర్చి, యలసూత్రమందున నిలువరించి
శ్రవణపేశలమైన ప్రణవనాదంబుతో, నానందబ్రహ్మంబు నలవరించి

గీ॥ జీవయాత్రకు తుది ఫలసిద్ధియైన, ముక్తికిందార్చు సద్గురుమూర్తి వగుచు
మించు కృప మాకు సాక్షాత్కరించినావు, రాటమా బంధనంబులు రాలకున్నె.

సీ॥ వివిధజాతులలోన భేదముల్ నశియించి, యైకమత్యంబు పెంపందు కొఱకు
హైందవజనుల మనోభీష్టసిద్ధికై, యాశీస్సు సురలచే నందుకొఱకు
భారతస్వాతంత్ర్య పరమసాధనమును, దేశజనులకు బోధించుకొఱకు
మొగి "నహింసా పరమోధర్మ" మనుట బ్రపంచమందునను జాటించుకొఱక

గీ॥ నిన్ను గాంధీమహాత్ముఁడు నిండుప్రేమ, కేతనముపైన నుండ నెక్కించినాడు
తావకప్రభ యాచంద్రతారకముగ, నెల్లదిశలను బరపి వర్ధిల్లుమమ్మ.

# భా వ రే ఖ

శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారు

ఈబహిర్భువన భస్సీమ లెన్నొతిరిగి, చూచినట్టి ద్రవ్యమ్ములే దాచి మార్చి
మరల చూపింతె చూపిన మటుకుచాలు, అంతరమ్మున సీ చూచు వింత చెపుమ.

సరియె బహిస్సు వీడితి ప్రసారితనైతిని లోన, హా తమః
పరివృత నైతి, ఆ నలుపుపాయలలోన జనించి దిర్దిరం
దిరుగు విచిత్ర జీవతతి తీవ్రతరార్భటి వన్నె వన్నె పూ
బరపులె కాదు కొండలును వాగులె కాదు పురాలె కాదటన్. ౨

సిసిమారీళ్ళను మించిపోయిన రయశ్చిత్రాంగణమ్మద్ది అం
దున లేదే కథగాని ఉన్న దెదియోద్యోతమ్ము కా దూరకన్
గనగా దోచుచునుండు నాజగతి కాఖ్యం బెద్దియో మానవుల్
వినువీధిన్ నడయాడుచుండు రిలపై రీతిన్ విడంబించుచున్. ౩

శృంగయుగమ్ముతోడి దొకసింగము మింటి కమాంత మెక్కి పో
వంగను నయ్యెడన్ దిరుగువా డొక డయ్యది చూచి పర్వతో
త్తుంగను కొండ యొండతని దాకెను దాన జనించె నిప్పుకల్
పొంగుచు పెద్ద వా గొకటి పూరితమాయె జగత్తు నిప్పుతో. ౪

---

# పాఠకులకు నివేదన

గత మాసము అధిక మాసమగుటవలన ఈ సంచిక నెల యాలస్యముగా తమకు చేరుచున్నది. ముందు ఆషాఢమాస సంచికతో ౧౨ సంచికలు పూర్తి కాగలవు. మరల శ్రావణమున యథాప్రకారము నాల్గవ సంవత్సరపు పెద్దసంచిక వెలువడును. కవి పండితులు చక్కని వ్యాసము లొసంగియు, దాతలు కానుకల నిచ్చియు 'విభూతి'ని ఈ కఱవు కాలమున నిలుపగోరుచున్నాము. చందాదారు లందరును ఈ ౧౨ వ సంచిక చేరు లోపుగ తమ తమ చందాను మనియార్డరుగా పంపించి తోడ్పడుదురని ఆశించుచున్నాము.

— సంపాదకుడు.

# ఏకశిలానగరము: ఓరుగల్లు!

శ్రీ చిలుకూరు పాపయ్య శాస్త్రిగారు.

ఏకశిలానగర మన 'ఓరుగల్లా' ఒంటిమిట్టయా యని చిరకాలము క్రిందట కీ. శే. వావిలికొలను సుబ్బారావుగారికిని, కీ. శే. జయంతి రామయ్య పంతులుగారికిని వాదోప వాదములు జరిగినవి. సిద్ధాంతములు స్థిరపడినవి. ప్రసిద్ధులైన విమర్శకు లందఱు తమ తమయభిప్రాయములను వెలువఱచిరి. ఏకశిలానగర మన ఓరుగల్లే యని బహుపండిత సమ్మతమై స్థిరపడినది. చరిత్ర పరిశోధకులకు నాటికి నేటికి ఓరుగల్లనుటకే యాధారము లెక్కుడుగఁ గాన వచ్చుచున్నవి.

ఇట్లుండ నీనడుమ శ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారి "సన్మాన సంపుటములో బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రి శర్మగారు 'రాయలసీమ కవులు' అను వ్యాసమును బ్రక టించియున్నారు. అందు పోతన్న నొంటిమిట్ట వాసినిగా స్థిరఱచినారు. కాని యీ వాదో పక్రమమునాఁటికి వెలువడని కొన్ని గ్రంథములు తరువాత వెలువడి యుండుటచే నీవిష యమునఁ గొంత వ్రాయఁ బ్రసక్తి గలిగి యుపక్రమించుచున్నాడను.

కీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావుగారు పైయుభయుల వాదమును బాగుగ విమ ర్శించి ఏకశిలా నగర మోరుగల్లేయని సిద్ధాంతీకరించుచుఁ బది ప్రమాణములను దెలిపి యున్నారు. (చూ. లక్ష్మణరాయ వ్యాసావళి. పు 23.) అం దయిదవప్రమాణము క్రీడాభిరామమున ఏకశిలానగర మోరుగల్లని పద్యములు ముద్రితమై యుండుట: ఆ పద్యము లివి—

ఉ॥ మంచన వింటివో వినవొ మన్మథుఁ డేకశిలాపురంబులోఁ
జంచలనేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రి పో
రించి, ప్రభాతకాలము పరిస్ఫుటమైనను ధర్మదార వ
ర్తించుచు నన్న వాఁ డదె కుటీగత కుక్కుట కంఠనాళముల్.

(క్రీ. పు. ౧౫. వే. ప్ర. శా.)

శా॥ ఓరుంగంటి పురంబు సౌధములపై నొప్పారెడిన్ జూచితే
యీ రెండల్ మణిహేమ కుంభములతో నేకాంతముల్ సేయుచున్
స్వారాజ్యప్రమదాఘన స్తనభరస్థానంబులం బాసి కా
శ్మీరక్షోదము ప్రాణవల్లభ దృఢాశ్లేషంబునన్ రాలె నాన్. (క్రీ. పు ౨౦.)

పై రెండు పద్యములు గలసి ఏకశిలానగర మోరుగల్లే యని స్థిరపరచునవియే గదా? మఱియు నీ వాదము బయలుదేఱు నాఁటికి ముద్రితముగాక, తరువాతఁ బరిష త్తుచేఁ బ్రకటింపఁబడిన "సింహాసన ద్వాత్రింశిక" (కొఱవి గోపరాజకవి ప్రణీతము)

యందును నీ సిద్ధాంతము స్థిరీకరింపఁబడినది. ఇంతియగాక గోదావరీనదికి 'గంగ' యను పేరానాఁటికి వాడుకలో నున్నట్లుగూడ నా కవి నోటనే వెలువడినది. చూడుఁడా పద్యములు.

ఉ. అకడ నీతిశాస్త్ర విదుఁడై గురు వీడ్కొని యేఁగె.........
గాకి తమాలశక్తి గనిగా నొనరించిన పైఁడి చట్టు నా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కు ధరిత్రిలోన నే
పోకలఁ బోనియిట్టి సిరిపుట్టిన యింటికి నోరుఁగంటికిన్. (ర. ఆ. ౧౬౦ ప)

ప్రామాణిక కవిశిఖామణి యగు నీ గోపరాజకవియు నించుమించు శ్రీనాథుని కాలమువాఁడు. బహువిశేషజ్ఞుఁడైన యీతఁడు యేకశిలానగర మోరుగల్లే యని విస్పష్టముగఁ దెలిపినాఁడుగదా! మఱియు—

క. ఆతఁడు త్ర్యంబక శిఖరో,ద్భూతను విఖ్యాతఁ బరమపూతఁ ద్రిలోకీ
మాత మహాపాతక సం,ఘాత విఘాతానుయాతఁ గనియెన్ గంగన్.

(ర. ఆ. ౧౬౦. ప.)

ఇట్లీతడు గోదావరిని గంగ యని పేర్కొనినాఁడు. త్ర్యంబక శిఖరోద్భూతయు, ఓరుగంటి సమీపముననున్న 'గంగ' గోదావరి యనుటలో సంశయింప నక్కఱలేదుగదా?

ఇట్లు ప్రాచీనులు-నర్వాచీనులు నగు కవిశేఖరులు నానాఁటి ప్రసిద్ధినిఁ బట్టి ఏకశిలానగర మోరుగల్లని నిర్ధారితముగఁ జాటుచుండ శాసనాద్యాధారములు వేనోళ్ళ నీ సిద్ధాంతము స్థిరీకరించుచుండ, వాదోపవాదములు ముగిసియుండ, తిరిగి 'ఒంటమిట్ట' యనుట మెట్టులో పాఠకు లరసెదరుగాక యని ప్రార్థన

(ఈ వ్యాసము నీమాసపు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక నుండి సేకరించినాము. కొందఱు స్థానీయాభిమానమువలన మహాకవులను తమ ప్రాంతమున బుట్టింప దలతురు. ఏకశిలా నగరమును, పోతన్నను రాయలసీమలో బుట్టించుటయే కాదు - ఇటీవల నొకరు పాల్కురికి సోమనాథుని సైతము రాయలసీమన గనిరి. విభూతి ౩ సంపుటము, 6 వ సంచికలోని "పాలకురికి వృత్తాంతము" అను వ్యాసము జదివినవారికి ఓరుగల్లు, బొమ్మెర, పాలకురికి అను క్షేత్రత్రయమును, పోతన సోమనాథులును, నిజాంరాష్ట్రపు నేటి వరంగలుకు జేరువగా నున్నట్లు నిస్సందేహముగ దెలిసి కొనవచ్చును. ఒక క్రొత్త ప్రమాణమును బైట బెట్టిన శ్రీ పాపయ్యశాస్త్రిగారు అభినంద్యులు - సంపాదకుడు.)

## విభూతి - ఆలస్యకారణము

ఈ నాలు గైదు మాసముల బట్టి విభూతి సరియైన తిథికి వచ్చుట లేదని కొందరు వ్రాసిరి. ఇది సత్యమే! పత్రిక బెజవాడలో అచ్చగును. అచ్చటినుండి పార్సెలు చేరిన పిదపగాని మేము పోస్టు చేయుటకు వీలులేదు. ప్రస్తుతము రైలు పార్సెళ్లు సకాలమునకు చేరక మిక్కిలి ఆలస్యముగా వచ్చుచున్నవి. "వీరశైవ మహాత్ములు" అను పుస్తకముల పార్సెలు ఒక నెల పదహారు రోజులకు బెజవాడనుండి సికింద్రాబాదుకు వేంచేసినది. ఒకప్పుడు పోస్టాఫీసులో కావలసినన్ని చీట్లు లభింపక గూడ ఆలస్యమగుచుండును. కావున పాఠకులు గమనింప ప్రార్థన.

—సం.

# వీరశైవము - శ్రీవైష్ణవము

భారతవర్షమందలి దృఢమైన భక్తిగల ధీరమ్మతములు : వీరశైవము శ్రీవైష్ణవము అని రెంటిని మాత్రమే తడుముకొనకుండ జెప్పవచ్చును. నామభేదము లెట్లున్నను ఉభయుల సిద్ధాంతములును ఆచారములును పరస్పరముగ సామ్యము గలిగి యున్నవని తోచుచుండును. అందుకనియే మిక్కిలి చతురులైన స్మార్తులు చిరకాలమునుండి "శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః" అని సంధ్యాగాన మాధురి నానుచున్నారు. పాఠకుల వినోదమునకై ఉభయమతములలోని సాదృశ్య మీక్రింద జూపబడుచున్నది.

వీరశైవమతస్థాపకులైన శ్రీజగద్గురు పంచాచార్యులు శివసూత్ర బ్రహ్మసూత్రములపై శక్తివిశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించినటులే శ్రీ వైష్ణవ మతస్థాపకులైన రామానుజాచార్యులైనను బ్రహ్మసూత్రములమీద విశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించిరి. పంచాచార్యులు పరబ్రహ్మము శక్తివిశిష్టమైనదని బోధింపగా రామానుజుడు చిదచిద్విశిష్ట మనెను. పంచాచార్యులు పారమార్థికముగా భేదాభేదము ఒప్పునట్లు రామానుజులును ఒప్పుకొనినారు. పంచాచార్యులు ప్రత్యక్ష - అనుమాన - ఆగమ ప్రమాణము అని చెప్పినటులే రామానుజులును ఈ మూడు ప్రమాణములనే అంగీకరించిరి. ఈ యుభయ మతాచార్యులును జగత్సత్యత్వము నంగీకరించి యధ్యాసవాదమును ఖండింతురు. ఉభయుల సిద్ధాంతమును విశిష్టాద్వైతమే కాని అల్పస్వల్పభేదము కలదు. పంచాచార్యులు శివుడే పరబ్రహ్మ మన రామానుజాచార్యులు విష్ణువే పరబ్రహ్మ మనిరి. వీరు శివుని నుండియే సకల చరాచరాత్మకమైన జగము నిర్మితమైనదని బోధింప వారు విష్ణువు నుండియే జగ ముద్భవించె ననిరి. పంచాచార్యులు పార్వతీ సహితుడైన పరమేశ్వరుని పూజింపవలెనని బోధింపగా రామానుజాచార్యులు లక్ష్మీసహితుడైన నారాయణుని పూజింపమనిరి. పరశివరూపమగు ఇష్టలింగమూర్తిని క్షణకాలమైనను వదలక శరీరమున ధరింపవలెనని పంచాచార్యులు విధింప, విష్ణువుయొక్క ఆయుధరూపము లైన శంఖచక్రాదులను విధిగా ధరింపవలెనని రామానుజులు శాసించిరి. పంచాచార్యులు గోమయము నుండి సిద్ధమైన భస్మమును తిర్యక్- త్రిపుండ్రముగా ధరింపుమనిరి. రామానుజులు మృత్తికతో సిద్ధమైన నామమును ఊర్ధ్వముగా ధరించుమనిరి. వీరు రుద్రాక్ష ధారణము బోధింప, వారు తులసీమాలను విధించిరి. శివాచార్యులు శివపూజకు ప్రధానముగా బిల్వపత్రమును విధింప, విష్ణుపరతంత్రులు తులసీ పత్రమును స్వీకరించిరి. వీరికి శివపంచాక్షరీ మహామంత్రము జప్య మయ్యెను; వారికి నారాయణాష్టాక్షరి శరణ్యమయ్యెను. పంచాచార్యులు జన్మించిన శిశువుకు శివుని సంబంధ ముండవలెననియును, దానికిగాను లింగధారణ, పంచాక్షరీ మంత్రోపదేశాదులు కావలెనని బోధింపగా, రామానుజాచార్యులు శిశువుకు

శీతశంఖచక్రధారణమును అష్టాక్షరీమంత్రోపదేశమును చేయవలెనని బోధించిరి. వీరును నెన్మిదవవత్సరమున ఉపనయనదీక్షాసంస్కారముల విధింప రామానుజులును ఉభయ సంస్కారముల బోధించిరి. పంచాచార్యులు శివదీక్షాసమయమున ద్విజులకు షడధ్వశుద్ధి సంస్కారమును విధించినట్లే రామానుజులును వైష్ణవదీక్షాకాలమున అధ్వశుద్ధిని జెప్పిరి. పంచాచార్యులు బ్రాహ్మణాదిచండాలపర్యంతముగా సకలురును తమతమ జాతుల కనుసారముగా లింగధారణ భస్మధారణ రుద్రాక్షధారణముల నొనర్చి వర్ణాశ్రమధర్మవిధిగా వర్తింపవలెనని బోధించినటులే రామానుజాచార్యులును, ఆచండాలము శంఖచక్రాదుల విధించినారు. వీరు తమ మతమునకు వీరశైవ మని నామకరణము జేయ వారు శ్రీవైష్ణవ లేక వీరవైష్ణవ నామమును నిర్ణయించిరి (ఒక విద్వాంసుడు వీరవైష్ణవపదము లేదని వాదించిరి గాని, బరోడావారి శక్తిసంగమతంత్రమును అవలోకింపగోరెదము). పంచాచార్యులు శివాగమములే పరమప్రమాణీభూతము లన, రామానుజులు పాంచరాత్రాగమములే ప్రమాణము లనిరి. వీరిలోను వారిలోను వితంతువులు కేశముల దీయక యుండుట గాంచనగును. ఉభయమతాచార్యులును వితంతువులకు ఏకభుక్తమును, కాషాయవస్త్రధారణమును, భగవత్పతిత్వమును విధించిరి. ఆచార్యవంశపు పరంపరాగతులైన గురువంశముల మర్యాద ప్రతిష్ఠలు, ఉభయాచార్యులును తుల్యముగ అంగీకరించినారు. వీరమతగురువులకు "అయ్యగారు" అను పదము పూజ్యావాచకమైనట్లు వైష్ణవులలో "అయ్యంగారు" శబ్దమును ప్రచారమున నున్నది. శివాచార్యులును తమ నామమునకు జివర ఆచార్యశబ్దము నుపయోగించినటులే వైష్ణవాచార్యులును ప్రతీతి గనియున్నారు. పంచాచార్యుల శివాధిక్యమును, రామానుజుల విష్ణ్వాధిక్యమును పోలికలు గలిగి యున్నవి. కావున రామానుజులకంటె పూర్వులైన పంచాచార్యులను రామానుజు లనుకరించిరా అనుటకంటెను పతిపత్నీస్వరూపులైన శివవిష్ణువులు శివాగమ విష్ణ్వాగమముల నామాంతరములతో ఒకే సిద్ధాంతమును నెలకొల్పి రనవచ్చును గదా! (పంచాచార్య ప్రభనుండి)

---

## మా రాజపోషకుల దానము

'విభూతి' రాజపోషకులైన నిడదవోలు ధాళాధూళి వీరయ్యగారు తమ పూర్వ వాగ్దాన ప్రకారము వందరూపాయాలను మిక్కిలి ఔదార్యముతో పంపించి యీ కరువు కాలమున సహాయ మొనర్చినారు. కృతజ్ఞత. తూపురాణి గ్రామనివాసులును, సుప్రసిద్ధులును, ధర్మాభిమానులును అగు బాజారు వీరయ్య విశ్వనాథముగార్లు 'విభూతి' రాజపోషకత్వము నంగీకరించి తమ యౌదార్యమును వెల్లడించుటయే కాక ఇతరులకు ఆదర్శమైనారని సంతసమును వెలిబుచ్చుచున్నాము——

సంపాదకుడు.

# భా వ వీ థి

### శ్రీ కవిరత్న లక్కన మల్లికార్జునుడుగారు

మఖిలోపుట్టి పుబ్బలో మన్నగుచున్నది. నీతనువున కాని నీవు రుచులపై భ్రాంతి, ఆడదానిమీద వలపు, తనువుపై మమత, పుత్రులపై మోహము, ధనముపై దురాశ, భోగముపై బుద్ధి కల్పించుకొన్నావు. వలలో చిక్కిన చేపలాగ బోనులోబడ్డ పెద్ద పులిలాగ తికమకలగల కష్టసుఖములను దాటలేక కొట్టుకొనుచున్నావు, ఏడ్చుచున్నావు, గర్జించుచున్నావు, నవ్వుచున్నావు, గర్వించుచున్నావు, తబ్బిబ్బై తన్నుకొనుచున్నావు. ఈ మాయబోనులో చిక్కిన జీవా! నీకు ఏది శరణ్యమోగదా! విత్తు విత్తక నీరు పోయక నేల పండినదాయన్నట్లు పచ్చని వెలుగులు విరజిమ్ముచు పెరిగిన గరిక పశువుల కింత తిండిగా నుండి జన్మము సార్థకముగా నొనరించుకొనుచున్నది. ఆగరిక మెక్కిన జంతువులు పొలముల దున్నియు పాలనిచ్చియు బండ్లు లాగియు, సాటిజీవులకు కొంత సేవలుచేసి పుణ్యములు కట్టుకొనుచున్నవి. ఇక నీవో గొంతెమ కోరికలు కొండంతలుగా కల్పించుకొని నిండు జీవులను మంటలో గలుపుచు కొండమీద కోతిలాగ దివ్యమైన కోటలపై బంగారపు గద్దెలపై కెక్కి కుప్పిగంతులతో కులుకుచున్నావు.

“ అడుసు త్రొక్కనేల ? కాలు కడగ నేల ?” చెడ్డ పనులు చేయుట లెందుకు ? చేసినందులకు పరితాపములు భరియింప నేల ? జపతపో దానవ్రతంబులందు మమత గలిగి పాప పరిహారార్థమై శుష్కించ నేల? “తనకు లేదని ఏడిస్తే ఒక కన్ను పరులకుందని ఏడిస్తే రెండు కండ్లు పోయినవట”. పరువు మాసిన బ్రతుకు పాపవు బ్రతుకు బ్రహ్మఏల పుట్టించినాడని యాతనిని నిందించితే బ్రతుకే వ్యర్థమై పాప పంకిలములో పడిందట, “కుక్కకు టెంకాయ అబ్బినట్లు” నరజన్మము దొరికితే మంచిదా? పిల్లికి పాలు దొరకినట్లు దొరికితే మంచిదా ? ఉట్టి కెక్కలేని తల్లి స్వర్గమెక్కునా ? నిన్ను నీవు స్వాధీనము చేసుకొనలేవు కాని లోకాలన్ని నీ చేతిలో నుంచి యాడించ నూహించెడి వెఱ్ఱి జీవా ! వెఱ్ఱి భ్రమలకు విఱ్ఱవీగే ఎడ్డె గొఱ్ఱె లాగ బలిస్తె నీకుమించిన కటికవాడు వచ్చి నరికి నరికి ముక్కలు ముక్కలుగా జేసి డొక్కలో వేసుకుంటాడేమొ, “పేరాస సిగ్గు ఎరుగదు” అన్నట్లు దురాలోచనలతో నిరంతరము పరులకు నపకారంబుల గావించి మకిర దున్నలాగ నీవు బలసి యుంటివా ? బాగా ఉందని యమధర్మరాజు నీపై నెక్కి దండంబులతో దండించునేమో, “ఎడ్డె బఱ్ఱె కేల ఇంగిత జ్ఞానం బన్నట్లు” విజ్ఞానులుచేయు హితబోధలు వినక విచ్చల విడిగా సంచరించితే పంటకావు వచ్చి దుడ్డుతో చావమోదు తాడేమొ! గొఱ్ఱె బలవటము గొల్లవాడికి మేలె అన్నట్లు” నీవు దుర్మార్గులతో బాగా బలిసియుంటే యమకింకరులకు కన్నుల పండువే నేమో, పసుపుకొమ్మియలేని పావులకారు పట్నంచూరవదలునా ? యన్నట్లు నీలో నున్న స్వార్థబుద్ధిని విడువలేని నీవు లోకాన్ని ఉద్ధరించుతానంటె నమ్మె వెఱ్ఱిబొఱ్ఱె జీవు లున్నారంటావా? ఉంటె వారిని మోసగించిన “కల్లరి నేర్పరియైనా దొరకకమానదన్నట్లు” నీ బ్రతుకు బండారము బయలుపడ్డప్పుడైనా నీ మోమున పేడకల్లాపి చల్లు

తారేమో, ఇంట గెలచి రచ్చగెలువ మన్నట్లు నీలో నున్న యరిషడ్వర్గంబులను జయించి పరులకు బోధజేసిన రచ్చలో జయము పొందగలవు గాని "తా చెడ్డకోతి వన మెల్లా చెరచిందన్నట్లు" నీ యిచ్ఛకొలది నీ శతృవులకు వశమై నీ కభ్యాసములైన యలవాటులన్ని పరులనెత్తినపెట్టితె నీకు పరువు దక్కగలదా ? లోకం గుర్తించిన తరువాత నీకు చివాట్లు పెట్టదా ? ముక్కుమూసుకుంటె మూకుగజీయలు పట్టదన్నట్టు పరువులేని బ్రతుకుతో నుండకపోతే నీ శరీరమును త్యాగముచే విసర్జించి లోకానికి మేలు చేయరాదు ? ఇంటాయన దగ్గర మగతన ముంటే పరులపంచ నెందు కుండాలి యన్నట్లు అంతట త్యాగబుద్ధియే యుంటే లోకములో సేవచేసి పవిత్రజన్మమే కావించుకొందును గదా యని యంటావా ? అవునులే పుట్టుకతో వచ్చిన బుద్ధులు పుడకలమీద పెడ్తేగాని పోవన్నట్లు నీ బుద్ధిని నీవు మార్చుకో జాలవు.

పోనీ పూజా వ్రతములు కావించుచు పుణ్యా మార్జించు కొంటానంటావా ? చిత్తశుద్ధి లేని శివ పూజ లేలయన్నట్లు నీవు పూజలుచేస్తే పుణ్యపురుషు డంటారా? చిత్తం శివుని మీద బుద్ధి చెప్పులమీదన్నట్లు పూజచేస్తున్నాడోయి అని లోకం నిన్ను నిందించుతుంది. పోనీ మాతృభూమికి సేవజేసి మహాత్ముడవు కారాదా ? "ఊకను ఎంత దంచినా ఫలము లేదన్నట్టు" "గుడ్డికన్ను తెరచినా ఒకటె మూసినా ఒకటే" అన్నట్లు నే నేమి చేయగలనంటావా ? పోనీ పేరుప్రతిష్ఠల కాశించక "కలిగిన దానితోనె తృప్తిపడమన్నట్లు" నీకు ప్రాప్తించిన దానితోనె సంతోషించి "ఉడుత సాయమన్నట్లు" నీశక్తికొలది పరుల కుపకారము చేయుచు సుఖపడరాదా? "శక్తికిమించిన పను లెన్నడు చేయకు" మన్నట్లు నీ శక్తిలోనె నీభుక్తి గడుపుకుంటే సుఖము లేదంటావా? కొండవలె పెరుగుతున్న కోరికలతో చచ్చిపోతున్నాను. కోరినఫలము చిక్కనప్పుడు దుఃఖం వస్తుంది. ఏడువకుండా ఉండగలనా ? కనుక భుక్తి ముక్తి దొరికె ఉపాయము లేదంటావా ? లేకేమి? ఆశ గెల్చువారి అరకాలితో బోలరన్నట్లు, నీవా యాశను జయించితే సుఖ పడతావేమో, విచారించుకో. సుఖమె కలదు. ఆశను జయించే ఉపాయము కావలెనుగదా! అది లేదంటావా ? "గురినిల్చిన చోట కుమురును చిత్తంబన్నట్లు" నీవెందైన నేగి సద్గురువునాశ్రయించి నీగురి నిల్పగలదేమో ప్రయత్నింపుము. "సత్సంగమువలన సాధించని పని లేదన్నట్టు." సాధింపగలవేమో. నిజమె అందుకనియె వీరశైవంబున "దీక్ష లేనివాడు పక్షికంటే బీడు" అనిఅన్నారు. ఎందైన సిద్ధుడైన ప్రసిద్ధుడగు గురువు దొరికితే బాగుపడగలననినమ్మి గురుపాదముపట్టిన నిన్నా గురుడు కట్టుపాటాలో నుంచును. "కట్టులో నున్న గొడ్డు కదలి ఎక్కడికి పో"దన్నట్టు నీవా కట్టుబాటులో మెలగుచు గురునియందు గురువిచ్చిన దైవచిహ్నమందు గురిని నిల్పిన వాడవై జితకాముడవు కాగలవు. "కామము గెల్చిన వానికి కైలాసమరుదా?" అన్నట్లు నీకు ముక్తి దొరకకలదు. "ముక్తి దొరికిన వానికి పునర్జన్మ లేదన్నట్టు" నీ విక మాయలోన చిక్కవు, మాయనంటవు, మాయాతీతుడై మహాత్ముడై ప్రకాశించెడి దివ్యశంకరుని పాదమె నీకు శరణ్యమై అతనివద్దనె నివసించి శాశ్వతచిదానంద మందగలవు. కాన ఓ జీవా ! తెలుగులోనున్న సామెతలే వెలుగులై నిన్నుద్ధరించుటకు సమర్థమై యున్నవి.

# మతాచార ధర్మము

శ్రీ బూసా వీరయ్యగారు

ఆదికాలమునుండి యన్ని మతములకు వేదసమ్మతముగా వచ్చుచున్న యాచార ధర్మములే యనుష్ఠేయములు. అటు లాచరించు మహనీయులకే యష్టైశ్వర్య సంపత్తియు, ముక్తియును కరతలామలకములు. ఇప్పటి కలికాలవింత లారంభమై మతాచార ధర్మములను మంటగలుప యత్నించుచున్నను, ప్రాచీన ధర్మపరాయణులు మాత్రము చేనిలోనికి పిట్టలను జొరనీయక ఫలసాయమును కాపాడు రైతుల భంగి నేటివరకు నరిష్టముల నరికట్టి ధర్మాచారములను సంరక్షించుచునే యున్నారు. అట్టి మహనీయు లగువారిని మనము నేత్రోత్సవముగా చూచుచునే యున్నాము. చూచియు నవీన యుగచర్యలకు లోనై మనము చేయునది లేకపోగా యట్టి మహనీయులను మనము నిందించుచున్నాము. కాని యది చాల పొరపాటనక తప్పదు. ఎట్లనిన కురు సంగ్రామమునం దేడక్షోహిణీల బలము గలిగిన పాండవేయులను, కృష్ణసహితముగా దరిఁజేరనీయక తరిమికొట్టి భీష్మునకు వెఱచి నిశాసమయమందు భీష్ముని శిబిరమునకు వెళ్ళి మమ్ము రక్షింపవలయును తాతా! యని మొఱపెట్టుకొనిన పాండవులయట్ల యెన్నటికేని యా ధర్మపరాయణులను శరణు జొరవలయునను సంగతిని మాత్రము మనము మరువరాదు.

ఈ మతాచారధర్మము లాయా మతముల పరంపరాగతమగు గురువులచే నుద్బోధింపఁబడుచున్నవి. ఇతర మత విషయములు నాకు బాగుగ గోచరింపవు. కాని వీరశైవమునమాత్రము వీరశైవ మతస్థాపనాచార్యు లగు పంచాచార్యుల పరంపరాగతమగు మతముల, ఉపమఠముల కధిపతులై శాఖోపశాఖలుగా నుండు గురువులచే మతాచార ధర్మములు వేదసమ్మతముగా ప్రతిపాదింపఁ బడుచున్నవి. అట్టి ధర్మస్వాములు లక్షోపలక్షలు యుపాచార్యులుగా నెన్నబడి మతసంస్కారములను సయుక్తికముగా నిర్వహించుచుండిరి. ఇట్లు నిర్వహించుచు వచ్చుచున్న నేటికాలమున నవయౌవనరూప లావణ్య విలాసవతులగు స్త్రీలు తాపసబృందములను కూడ తబ్బిబ్బొనరించి భ్రమింపఁ జేయునట్లిప్పటి కలికాల వింతలు కొందఱిసాములను భ్రమింపఁజేసి తమవలలో జిక్కించుకొనియె. వారును తమకు పైవారగు మూలగురువులు తమను మందలింతు రను మాటకూడ మఱచి నవీన యుగ చర్యలలోఁ దాండవ మాడజొచ్చిరి. కలికాలపు వింతలన్నేహ మారంభమైన వెంటనే ప్రాచీన మతాచార ధర్మములు కొన్ని వారియందు నిలువనేరక మార్జాల దర్శనమైన మూషకముభంగి పలాయనసూత్ర మవలంబించెను. కేవలము తమకు బోధగురువులైన స్వాముల సంస్కారములే యిటు లుండ వారి శిష్యులసంగతి మన మూహింప

నక్కఱయే లేదు. ఇందుమూలముననే వీర శైవమున కైశ్వర్యము కుంగిపోయి దారిద్ర్యము దాపరింపఁజొచ్చె. ఇట్టి పరిస్థితులు మనకు దాపైనపుడు, మత మేల? మతాచారధర్మము లేల? స్నానసంధ్యాద్యనుష్ఠానము లేల? శివపూజ లేల? శివు డేల? ఆహా! ఏమి యీ కాలవైపరీత్యము! కాదు కాదు. వ్యక్తిగత స్వాతంత్ర్యదోషములు తప్ప కాలవైపరీత్య మెన్నటికిని కాజాలదు. శిష్యులైనవారు తమ గురువులు తమను శిక్షింతు రేమో యను విజ్ఞానము తెలిసి తమ తమ సంస్కారములయందు చక్కఁగ ప్రవర్తిల్లినచో కాల మేమిచేయగలదు? అగ్నికణముల నంటుకొనినగదా బొబ్బలులేచుట. ఇట్టి యరిష్టము లొకా నొకప్పుడు కొన్ని కారణములవలన సంప్రాప్తమైనను, ఉపద్రోణాచార్యులను మట్టి బొమ్మను గురువుగా భావించి తన యెదుట నిలుపుకొని భక్తినవలంబించి విలువిద్యను సంపాదించిన యేకలవ్యునిభంగి, ప్రతివీరశైవుడును తమ మూలగురువులగు పంచాచార్యులను తమ హృదయపీఠములందు నెలకొల్పి భక్తితో మతాచారధర్మముల నాచరించి భక్తియం దుత్తీర్ణులగుచో మతాచారధర్మయశోలత పల్లవింపకుండెడి దేనా? వీరశైవ మెప్పటియట్లు శాంతిధర్మ వైభవముల తాండవం బాడకుండెడి దేనా? మహిమలు మందగిల్లి మాంద్యము వహించెడివా? అట్లెన్నటికిని కాఁజాలదు. ప్రతివీరశైవుడును యప్రమత్తుఁడై కులాచారపద్ధతి ననుసరించి క్రమమైన సంస్కారములు జేయుచుండిన వీరశైవమతము పూర్వమువలె మహదైశ్వర్యములతో మహిమలు గలిగి ప్రకాశించుచునే యుండును.

సుజ్ఞానులు మాత్రము నేటివఱకును నూటిదప్పక కట్టుబాటులయందు గాని, ధర్మములయందుగాని, యాచారములయందుగాని, భక్తియందుగాని వెనుదీయక పోరాడుచు ముక్తిపథసోపానముల నధిరోహించుచునే యుండిరి. అజ్ఞానులుకూడ పెద్దవారు నడచిన దే బాట యని యొక మూఢనమ్మకమును తమ మనమ్ములం దిడుకొని గురుచరాదులను స్మరించుచు సుజ్ఞానులై వారి యడుగులకు మడుగులిడుచు నాచారధర్మముల నీశ్వరుని సేవించుచు వారి మార్గమునే యనుసరించుచుండిరి. ఇక సుజ్ఞానాజ్ఞానులు (తెలిసీ తెలియని వారు) మాత్రము మత మనగా నేమి? యాచారమన నెట్టిది? ధర్మమనఁగా నెట్లుండును? ఎరుపా? తెలుపా? దేవుడనఁగా నెవఁడు? వ్యక్తుల పుట్టుకలన్నియు నొక్కటి గాదా? శుచిగా పదార్థములు తయారుచేయు వా రెట్టి జాతివారైన నేమి? వారు చేసిన పదార్థము లేల భుజింపకూడదు. గంగకు మైల కలదా? ఇతర జాతీయులు తయారుచేసిన సోడానీటి నెందుకు త్రాగకూడదు? అను విపరీతప్రశ్నలను మాటిమాటికి గుప్పించుచు, తమ మతధర్మముల స్పృడలేకయు, కేవలము నవీనయుగచర్యలకు లోనుగాకయు తారుమారగుచుండిరి.

అట్టి పురుషులు ముక్తిమార్గమునకు దూరస్థు లగుదురు. ఎట్లనిన, ఒకగ్రామమును చేరుటకు రెండుమార్గము లుండుననుకొనుడు. ఆగ్రామము వెళ్లుటకు తమ కుచితమగు త్రోవ

ననుసరించి పోవుట సమంజసమగును గాని, తమకు రెండుపాదములు గలవుగదాయని రెండు త్రోవలకు రెండుపాదములు జొప్పించి గమ్యస్థానమును చేరగలరా? అట్లాచరించుట మాత్రము పొసఁగదు. అట్టి పరిస్థితులలో తమకు శక్తిలేనపుడు సమంజసమగు దారినే పోవలయునుగాని, తమ కాచారానాచారములయందు సామర్థ్యముగలదనెడి వాగాడంబర ములతో ప్రయోజన మేమియులేదు. కాబట్టి వీరశైవులెల్లరు మతాచార ధర్మములయం దప్రమత్తులై మెలంగినచో వీరశైవ మతముమహదైశ్వర్య మహిమలు గలిఁగి శోభిల్లుననుట కు సుప్రసిద్ధ వీరమాహేశ్వరులును, లోకవిఖ్యాత పండితులునైన శ్రీహారదత్తాచార్యులే ప్రమాణము. పూర్వము నవాబు గవర్నమెంటు వారివద్ద తమ మహిమలను చూపించి, రాజును మెప్పించి గొప్ప గొప్ప హుకుములను సంపాదించిన షట్స్థల మూర్తియగు శ్రీ చేబోలు ముమ్మడి సిద్ద శంభుస్వాములే యాదర్శము. ఎంతోదూరము పోనేల? ఇటీవల షుమారేబది వత్సరములకు పూర్వము (నరసారావుపేట సమీపమున లింగంగుంట్ల యగ్రహారమను గ్రామములో లింగైక్యమైన వీరమహేశ్వరులగు శ్రీ రాచోటీశ్వరస్వాములు చూపించిన మహిమలే యిందుకు ప్రబలమైన ప్రమాణములు. వీరికి సమకాలికులును, మతాచార ధర్మములయం దమిత నిష్ఠాగరిష్ఠులును, ఆగామి సంచితములు దెలిసిన మహనీయులును, సుప్రసిద్ధ వీరశైవులు నగు శ్రీ చుక్కా (అంగలూరు) వీరయ్యగారే ప్రబల నిదర్శనము. ఇంకను కోట్లకొలది మహిమ సంపన్నులు శాపానుగ్రహశక్తి గలిఁగి ప్రవర్తిల్లిరని వీరశైవమత గ్రంథములు ఘంటాఘోషమగా నేకరువు పెట్టుచున్నవని విజ్ఞాను లైన వారందరికి విదితమయియేయున్నది. ప్రతి వీరశైవుడు వేదిరక్తము నాళముల యందు ప్రవహించు నంతవరకు మతాచార ధర్మములను మఱువక యనుష్ఠించుచో వీరశైవమతము పూర్వమున్న యున్నత స్థితిని మరల పొందగలుగునని నాయాశయము. మతాచార ధర్మక్షీణతను గుఱించి సూచించినానుగాని నేనెవరికిని నీతి దెలుపునంతటి శక్తిగలవాఁడను కాను. మనము మాత్రము భక్తిగలిఁగి మెలఁగుచుండిన మన యెల్లరకును పరమేశ్వరుడే మహదైశ్వర్యముల నొసఁగి తుదకు ముక్తిపథమునకుఁ జేర్పగలడని నమ్ముచున్నాను.

సీ॥ గడియారమునకును ♦ కాలచక్రమునకు, నేస్తంబు గలిగియు ♦ నెగడు భంగి
ఇలను సూర్యావర్త ♦ మిచ్చుచే రవిబోవు, మార్గంబు వీడక ♦ మసలుభంగి
తనువు వెంబడి నీడ ♦ తనువును వదలక, పరమమైత్రిని గల్గి ♦ పరగు భంగి
గంధకుజంబున ♦ గలుగు సువాసన, తరువును విడువక ♦ దనరుభంగి

గీ॥ ఇంగితమ్మున సుగుణులై ♦ యింపుమీర తథ్య మనుచు మతాచార ♦ ధర్మములతొ
చెలిమి బాయక నీకు పూ♦జించు నెడల, ముక్తి చేకూరు, నైశ్వర్య♦ములును గల్గు.

―――

శ్రీ మటికె నాగయ్య ధర్మనిలయమందలి

# వీరశైవ గురుకులమునకు

## మహాజనుల దానము

సికింద్రాబాదున శ్రీ మటికె నాగయ్యగారిచే నిర్మింపబడిన ధర్మనిలయమునందు వీరశైవ గురుకుల మను సంస్కృత పాఠశాలయు విద్యార్థి భోజనవసతియు, వీరభద్ర విశ్వేశ్వర దేవాలయమును, శైవ భారతీ భవన గ్రంథాలయమును, శివధర్మ గ్రంథమాలయు, 'విభూతి' పత్రికయు అను వివిధ సంస్థలు ఆరేడువత్స రములనుండి యథాశక్తి కర్తవ్య నిర్వహణము గావించుచున్న సంగతి అందరికి తెలిసియే యున్నది. మానివేదన ననుసరించి యనేకు లగు ఉదార మహనీయులు వస్తువుల రూపముగా అపుడపుడు మాకు సహాయముచేయుచు వచ్చినారు. కొందరి నామములను ఆయా సమయములందు స్థానిక పత్రికలలో ప్రకటించినాము. ఈ క్రింది మహాశయులుకూడ ఆయా వస్తువులను దయతో నొసంగి మా కృతజ్ఞతకు పాత్రులైనారు. ఎవరి పేరునైనను వదలినచో ఆ పొరపాటును సూచింప గోరుచున్నాము. స్వల్పమైన ఆదాయమునుబట్టి ఎక్కువ విద్యార్థులను చేర్చుటకు వీలులేదు. వీరశైవ మహాజనులు ఆయా వస్తువులను అనగా బియ్యము, పప్పులు, జొన్నలు, గోధు మలు, నెయ్యి, చింతపండు, మిరియపుకాయలు, కూరగాయలు, కొబ్బరికాయలు, వంటచెరుకులు మున్నగు వానిని వర్షాశనముగా ప్రతివత్సరము బంపునట్లు మొదట వాగ్దాన మొనర్చినచో ఆ విధముగా ప్రకటించె దము. అట్టి యుపకారము జరుగుచో ఎక్కువ విద్యార్థులను చేర్చుకొనుటకును, ఇక్కడికి వచ్చు ఎక్కువ అతి థుల శివపూజలకును వీలుకలిగించిన వారగుదురు. కావున ఉదారచరితు లందరును గమనింపగోరుచున్నాము.

| | | |
|---|---|---|
| ౩ బస్తాల జొన్నలు | శ్రీ | అడివయ్యగారు, తాండూరు. |
| ౨ బండ్ల కట్టెలు<br>౧ అంకం చింతపండు<br>౨ సేర్ల నెయ్యి | ,, | కంపినిమఠం గురుపాదయ్యగారు, మైలవరం. |
| ౩ సేర్ల నెయ్యి | ,, | మఠంనడిపూడి నాగభూషణదేవరగారు, చేబ్రోలు. |
| ౧ బండి కట్టెలు | ,, | కొయ్యడ వీరప్పగారు, కొయ్యడ. |
| ౧ బండి కట్టెలు | ,, | కర్రె శివప్పగారు, మైలవరం. |
| ౨ సేర్ల నెయ్యి | ,, | మార్కండేయమఠం శంకరయ్యగారు, కొలనుపాక, |
| ౧౨ సేర్ల మిరపపండ్లు | ,, | పురాణం చంద్రశేఖరయ్యగారు, ముబారకాపురం. |
| ౬ సేర్ల మిరపపండ్లు | ,, | లింగయ్యగారు, దోమకొండ. |
| ౨ గోనెతట్లు | ,, | దుద్దాల బుచ్చప్పగారు, సదాశివపేట. |
| ౧ చిన్న బల్లడెస్కు | ,, | రావికోటిమఠము వీరభద్రయ్యగారు, హైదరాబాదు. |
| ౨ దీపపుశెమ్మెలు, సదా దీపా రాధననూనె (ఆలయములోకి) | ,, | చీకోటి వీరన్నగారు, తర్వాత వీరిపుత్రులును, సికింద్రాబాదు. |
| రేకులపాక (రు ౧౦) | ,, | అత్తెల్లి శంకరప్పగారు, జెలిజాల. |
| అల్లంవగైరాసదా | ,, | మాడపు శంకరప్పగారు, సికింద్రాబాదు. |
| ౧ బుట్ట మామిడిపండ్లు | ,, | ఆరాధ్యుల మూటయ్యగారు, సామర్లకోట. |

(కొదువలు తర్వాత)

# నీరక్షీరవివేకము

**తత్సమ చంద్రిక:**— కర్త: శిరోమణి, సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు ౪౪ జీరా సికిందాబాదు, పుటలు ౨౦౦, చక్కని అచ్చుకాగిదములు, బైండు, వెల ౩—౦—౦ ఆంధ్రభాషకు గావలసిన అమూల్యాలంకార మొకటి నేటికి శ్రీ శాస్త్రిగారిచే నిర్మింపబడినది. ఇదియొక ఆంధ్రభాషాభిజ్ఞులకేకాదు అనువదింపబడుచో ద్రవిడ కర్ణాటక హిందీ వంగమహారాష్ట్రాది భాషాసేవకుల కెల్లరకును ఉపకరింపగలదు. మాకు దెలిసినంతవరకు దేశభాషలలో నింత సమగ్రమైన వ్యాకరణ గ్రంథము పుట్టలేదు. సంస్కృత భాషా శబ్దజాలము ఒక మహాసాగరము. చిరకాలము వ్యాకరణశాస్త్ర పఠనము గావించినను కృత్తద్ధిత సమాస రూపములు సులభసాధ్యములుగావు. సంస్కృతపండితులే రూపములు, ప్రయోగములు దెలియక ఎన్నియో వేళల తికమకలు పడుచుందురు. ఇక విద్యార్థుల కష్టములు వేరుగా జెప్పపనిలేదు. ఈ గ్రంథ సాహాయ్యమున సాధారణముగ శబ్దస్వరూపముల సాధుత్వమును గురుతింపవచ్చును. ఈ గ్రంథము సరిగ పఠన పాఠనలలో ప్రచారమగుచో సిద్ధాంత కౌముది మున్నగు ఉద్గ్రంథములు మూలకు బడునేమో యని సందేహము గలుగుచున్నది.

ఇందు సంధి కృదంత ఉపసర్గ తద్ధిత స్త్రీప్రత్యయ అవ్యయ సమాస రూపభేద లౌకిక న్యాయములను తొమ్మిది ప్రకరణములు గలవు. సాధ్యమైనంత సోదాహరణముగ, సులభముగ ఆంధ్రభాషకు గావలసిన సంస్కృత (తత్సమ) శబ్దరూపములు నియమములతోగూడ దెలుపబడినవి. కృదంతసమాసప్రకరణములు మిక్కిలి ప్రశస్తములు. విద్యార్థులకు, కవులకు, పండితులకు గురువువలె నీగ్రంథము సదా తోడ్పడుచుండగలదనియును, ఇది శ్రీ సూ. నా. శాస్త్రిగారి పాండిత్యప్రతిభా విశేషములకు సమర్థమైన సాక్ష్యమై, వారి భాషాచార్యత్వమును స్థిర పరచగలదని నమ్ముచున్నాము. శ్రీ గద్వాల మహారాణిగారు శ్రీ శ్రీ ఆదిలక్ష్మి దేవమ్మ అమ్మయ్యగారు ఈయుద్గ్రంథ ప్రకాశమునకు సంపూర్ణముగ మహాదాన మొనర్చి శాస్త్రిగారి దీర్ఘ పరిశ్రమను సార్థకపరచినందులకు భాషాసేవకులందరును కృతజ్ఞులై యుండగలరు. శ్రీ శాస్త్రిగారు "తత్సమ చంద్రిక"వంటి గొప్ప "దేశ్యదీపము"ను సైతము వెలిగించి సంస్కృతాంధ్రోభయ భాషావ్యాకరణాచార్య పీఠము నధిరోహింతురు గాక! శ్రీవారి నీ గ్రంథరచనా సందర్భమున మిక్కిలి యభినందించుచు పీఠికలోని ప్రథమ వాక్యముమాత్రము మున్ముందైనను పరివర్తింపబడవలెనని కోరుచున్నాము.

**మధురవాణీ:**—(సంస్కృత మాసపత్రిక) సంపాదకులు, గలగలి రామాచార్యులు, బుర్లి శ్రీనివాసాచార్యులును, గర్గూ కార్యాలయం; బెళగాంవ్. పుటలు ౩౬ డెమ్మీరఫ్ సంవత్సర చందా 2—8—0 ఏడువత్సరములనుండి మిక్కిలి యుత్సాహముతో నడుపబడుచున్న ఈమాసపత్రిక దక్షిణదేశమున సంస్కృత భాషాప్రచారమునకు మిక్కిలి తోడ్పడుచున్నది. ఇందు వివిధ విషయములను గూర్చిన గద్యవ్యాసములును కథలును సులభశైలిలో ప్రచురింపబడు టొక విశేషము. ప్రస్తుతసంచిక పూనాలో జరిగిన సంస్కృత సాహిత్యసమ్మేళనమునకు సంబంధించినది కావున అధ్యక్షాదుల యుపన్యాసములతోడను, వార్తలు చిత్రములు మున్నగువానితోడను నూరు పుటలతో నలరారుచున్నది. ఏ మాత్రము సంస్కృతము దెలిసినను దీనికి చందాదారులై పత్రికను పోషించి తమ భాషాభివృద్ధిని జేసికొనవచ్చును. దీని యభివృద్ధిని గోరుచు సంపాదకుల ప్రయత్నవిశేషముల పొగడుచున్నాము.

**మైసూరు వైశ్యపత్రిక:**—(కర్ణాట కాంధ్రమాసపత్రిక) సంపాదకులు; పి. గోపాలకృష్ణశెట్టిగారు, వాసవాంబాభవన, అశోకారస్తా, మైసూరు. పుటలు ౬౦, క్రౌనరఫ్ చందా 2-4-0. ఇది యొక చక్కని మాసపత్రిక. వైశ్యులకు ఉపయుక్తములగు అనేకవ్యాసములు కలవు, కన్నడమువలె ఆంధ్రమునను ఎక్కువ పుటలను సంపాదకులు ప్రకటించుచో ఆంధ్రదేశమునను ఇది బాగుగా ప్రచారమునందగలదని మాయాశయము. లక్ష్మీపుత్రులు కావున పత్రికను చౌక వెలలో నిచ్చుచున్నారు. అభిమానులందరు వెంటనే చందాదారులుగా చేరి ఈ పత్రికవారు సిద్ధపరపదలచిన సత్యమైన వైశ్యచరిత్రకు తోడ్పడ గోరుచున్నాము.

**కాదంబరి:** కర్త, అద్దేపల్లి నాగగోపాలరావుగారు, గౌర్నరుపేట, బెజవాడ. పుటలు ౯౦, ముద్దులొలుకు ముద్రణము. ముచ్చటైన కాగితములు. వెల 0-12-0. మహాకవి బాణుని సుప్రసిద్ధమైన కాదంబరీ "గ్రంథముయొక్క కథాసంగ్రహ"మునే శ్రీ అ. గో. రావుగారు సులభమగు శైలిలో నూటిగ హృద్యము

